# ఆమె వ్యభిచారిణా?



శ్రీమానాపురం అప్పారావు పట్నాయక్,

# 1

'చంద్రా! నన్ను క్రొత్తవానిలాచూచి బెదురుతూన్నావా!'

"నిన్ను కలుసుకొనకూడదని మాఅమ్మ హెచ్చరించింది"

"ఏం చంద్రా! క్రొత్తవాడినా నేను!"

"క్రొత్తవాడివై వచ్చావు పట్నంనుంచి- పట్నంలో పెరగిన మనుష్యులు అక్కడి మోహాలకు, అబద్ధాలకు అలవాటుపడి; తిరు పల్లె తిరిగివచ్చినప్పుడు పట్నంలోని వింతలు విచిత్రంగా చెప్పి కదలించి కన్యలను వశపరచుకొంటారని—

"చంద్రా! నేను ఎదిగి చిన్ననాటినుంచి ప్రేమింపబడుతూండే కన్యవు నీవే. ఏ మోసం చేసినా, అన్యాయంచేసినా నిన్నుగురించేగదా"!

"నీవు పట్నంవెళ్ళి చెడిపోయావని యిక్కడ అందరూ చెప్పుకొనేవారు. నేను ఎందుకో మనసులో బాధపడేదానను. నిన్ను చెడు మార్గంనుంచి రక్షించవలసినదిగా మనసులో కోరేదానను భగవంతుని-

"అక్కడిస్నేహితుల మాటలునమ్మి మోసపోయి డబ్బును వారి ఆనందంకోసం ఖర్చుచేసేవాడను. వారిబలవంతం మీదనే బడి కూడమాని ఆటల వ్యామోహంలో కాలం గడిపేవాడను—"

"మీనాన్న పంపుడబ్బు చదువునకు వినియోగించుకొనలేదా!

"లేదుచంద్రా! మన పల్లెలోని నిష్కల్మష స్నేహాలుకావు అక్కడవి. అక్కడ అంతా స్వార్థపరులు. స్తోత్రపాఠములు చదవడం చక్కగా నేర్చిన మేధావులు. వారిబలవంతంలోనే అమాయకంగా చరించి మానాన్న పంపే ధనాన్ని నిజంగా దుర్వినియోగమే చేసుకొన్నాను. అందుచేతనే చదువుకు స్వస్తిచెప్పి తిరిగి వచ్చివేశాను—"

"ఇహ వెళ్ళవక్కరలేదా ఆనంద్!—"

'వెళ్ళను. నానిశ్చయాన్ని మానాన్నగారికి నారాకతోనే విని పించాను. నాచదువునుగూర్చి చెడుగా వింటుండే మానాన్నకు నాకోరిక ఆశ్చర్యమనిపించక అంగీకరించారు."

మున్సబుగారి కొడుకు పట్నంలో పాడుఅయినాడని అందరూ అంటే నామనసు ఎట్లానోమారేది. అసలు నీదృష్టిలో నేను జ్ఞాపకం ఉంటానా అనిపించేది—"

"చంద్రా! నీకంటె నాకీ ప్రపంచంలో ప్రియతమమైనది లేదు మొన్న మాబడిసెలవులలోకూడ నేను నీకోసమేగా వచ్చింది! నీవు అప్పట్లోనే తాతగారి యింటికి వెళ్ళినావని విని ఈఊరులో ఉండ నిష్టములేక పట్నంపోయాను—

"అవును. నన్నుగూర్చి మాయింటికివచ్చి పదేమారులు అడిగావనికూడ విన్నాను. అందుకే మాఅమ్మయిప్పుడు నన్ను మరీ హెచ్చరించి మాయింటినుంచి కదలకుండా ఆపుతోంది.

"అవును. నేను ఈఊరువచ్చిన మొదటిరోజున మీయింటికి నిన్ను కలుసుకొనవచ్చాను. అప్పుడు మీఅమ్మనావల్ల అనూయను కనబరుస్తూ నీవు యింటలేవని చెప్పింది. నేను తిరిగి ఏదో అడగబోతూండగనే నామాట వినకుండ పశువులశాలలోనికి వెళ్ళిపోయింది. నీతో నాకలయిక నీతలిదండ్రులకు యిష్టంలేదని అప్పుడు తెలుసుకొని, గారణం అరయలేక తలవంచుకొని యింటిదారిని పట్టివచ్చాను.'

'ఆనంద్? క్షమించు. నీవల్ల నాశీలం చెడుతుందేమోననే బెంగతోనే మాఅమ్మ భయపడుతూ అనూయతను చూపుతూంది. నీవు నాకొరకు చూస్తున్నావనికూడ నేను ఎరిగే నిన్ను కలుసుకొన మూడుదినములనుంచి ప్రయత్నిస్తూ నీవు ఈవేళలో యిక్కడ ఉంటావని ఎరిగి యిక్కడకు వచ్చాను."

"చంద్రా, ఎందరకు ఎట్టి అపోహలు కలిగినా నీవు మాత్రం నాకట్ల నమ్మకం కలిగి ఉంటావని ఆశించాను— ఆశతోనే తిరిగి వచ్చాను—"

"మీరు అక్కడ చాలమంది స్త్రీలతో సాంగత్యం మేర్పరచిందని కూడ విన్నాను."

'అవును చంద్రా; ఎన్ని తప్పుడు అపోహలు తోచినా నేను మాత్రం ఏ స్త్రీకి లొంగలేదని గర్వంగా చెప్తున్నాను- వారి కృత్రిమ సౌందర్యములు నన్ను మోసగించలేక పోయినాయి నిన్ను మాది-మనసార ప్రేమించి, హృదయంతో నిన్ను అర్చించ చూడగలిగే ఈనాకళ్లకు అక్కడ స్త్రీల సౌందర్యములు నన్ను మోసగించి ఆకర్షించలేక పోయినాయి—

"ఆనంద్? పట్నం మాటలు బాగా పట్టుబడ్డాయా? అంది చిరునవ్వుతో ఆతని మాటలకు సిగ్గుతో తలవంచుకొంటూ —

"చంద్రా, నిన్ను మోసం చేయుటకు తలచడం నన్ను నేను మోసం చేసుకొనడమే అని నేను ఎరుగుదును నాయందు నీకిట్టి దురభిప్రాయం కలగడం నా దురదృష్టం'

"ఊరకే తమాషాగా అన్నమాటలకు కూడ విచారపడుతున్నావా?

"చంద్రా, నీ అనుగ్రహమే నా అదృష్టమని అనుకుంటూన్న నాకు—"

"ఆనంద్! ఇహ నీవు పట్నం వెళ్ళకూడదని కోరుతూన్నాను నేను—"

"నీ కోరికకు అంగీకరిస్తున్నాను నేను—

"ఆనంద్! నీవు నాముందు చేసిన ప్రమాణములు జ్ఞాపకంలో ఉన్నావా.—

‘చంద్రా! ఎలామరువగలుగుతాను!— నీతో గడపిన మధుర ఘట్టాలు ఎప్పటికీ నాదృష్టిపదంనుంచి తప్పిపోనలేవు నీవుకూడ బలవరచి చెప్పడంచేతనే చదువుకొరకు పట్నం వెళ్లాను. ఆచదువులో తంత్రములు అలవడేజ్ఞానం ఉంటుంది. మనపల్లెలో ఉండే శాంతి, పరోపకారదీక్ష, సహృదయత, ప్రేమ అక్కడమచ్చుకు కూడలేము. అందుచేతనే విసిగి తిరిగి వచ్చివేశాను.”

‘అవును, అలానే విన్నాను నేనుకూడా. అందుచేతనే పట్నం చూడ ఎన్నడూ బయలుదేరనేలేదు.”

‘వద్దు చంద్రా!— నీబోటి స్త్రీ ఆవయసులో అక్కడతిరుగ కూడదు. అమాయకంగా తిరిగే ఎటువంటివారిని చెడుగా అర్థం చేసుకొని అక్కడివారు అపవాదులుగా ప్రవర్తించి చూస్తారు అక్కడకు నీవు వెళ్ళకూడదు.”

‘ఆనంద్! అక్కడకు వెళ్ళదలచలేదు. నేను వెళ్ళనని చెప్పాను కదా!” అంది చంద్ర అతనికి చేరువగా నడచి అతనికండ్లలోనికి చూస్తూ—

“చంద్రా!— నీకు ఈమధ్య పెండ్లిసంబంధములు వచ్చినట్లు కూడ విన్నాను—”

‘ఆతరువాతిసంగతులు కూడ విన్నావు కదా!—”

‘అవును. ఆసంబంధములు నీవు అక్కర్లేదని త్రోసివుచ్చావని కూడ విన్నాను—”

“ఆనందును కోరే ఈమనస్సు మరియొకరితో వివాహానికి అంగీకరించగలదా!—”

“చంద్రా!— నీకోరికకు అన్యాయంజరుగదు. మానాన్నగారు కూడ మనప్రణయగాథలు పూర్తిగాఎరుగుదురని మానేజరు సుందరయ్యవల్ల విన్నాను—”

"మీనాన్నగారా మనకలయికనుగూర్చి వినకమా!"

"ఫరవాలేదు. తొందరపడకుము. మనఅన్యోన్యతను ఎరిగిన నాతండ్రి మనపేరిమకలయికలనుగూర్చివిని చాలఆనందపడ్డారట. నీవు ఈపల్లెలో అవతరించిన అవతారజగన్మోహన లక్ష్మివని ఆయనే నోటారస్తుతించారట. నీముఖంలో లక్ష్మీకళతాండవిస్తూ దనీ నీవివాహంతో నాఅదృష్టం ఫలిస్తుందనీ, చాలబాగుపడిపోతానని పరవశంగా అనీ. నిన్నే కోడలుగా చేసుకొంటానని నేనుగోరకుండానే ఆయనగారే అన్నారట—"

"ఇది నిజమా ఆనంద్!—"

"నీదగ్గిర అబద్ధమా?—ఓవేళ మానాన్న. అంగీకరించకపోయినా మనపెండ్లి ఆగదని నీకువాగ్దానం ఇచ్చానుకదా!—"

"ఆనంద్?—నీరాకకోసమే నిరీక్షిస్తూ. నీతో స్వేచ్ఛగాతిరిగి కలసిఉండే అధికారంకోసమే ఆశిస్తూ—ఇచ్ఛగా మమకారంలో ఊగిసలాడుతూ—స్వప్నములలో నిన్నుచూస్తూ—మనసు అనాడే నీకు అంకితంచేసాను. ఆదరిస్తావనికూడ నేనుయెరుగుదును. అందుచేతనే—

"చందా?—నీవు నాహృదయసామ్రాజ్యలక్ష్మివి. ఈహృదయంలో మరిఏపేరిమకూ చోటులేదు. నీతోనే నాజీవితం దొర్లిపోవాలి, పూర్తిగా నీలోఐక్యమయిన జీవినినేను. నామీద అధికారం నీకు ఏనాడోయిచ్చాను. నీశాశనంమీదనేగా నేను పట్నం చదువుకు పోయాను!—"

"చదువుకొని రావలసినదిగా కోరానుగాని, చెడిపోయి రావలసినదిగా కోరానా నేను!—"

"నీవు నాచెంతనేఉంటే అంతమాత్రమయినా చెడేవాడినా

కాదు, నీ ఎడబాటును నీవే శాళించడంచేతనే ఈలాంటి మార్పుకైనా కారణమయింది—'

"ఆనేరం నామెత్తిన తోస్తున్నావా!—"అంది వారగా చిరునవ్వుతో చూస్తూ—

"భర్త దోషానికి భార్యయే కారణమౌతుంది—'అంటూ ఆమె జీరపమిటను ఆమె భుజాలచుట్టూ తిప్పి నవ్వించాడు—

ఆతడు ఆమెకు చేరువగాచేరి తాకుతూ ఆమెమొహాన్ని తన వంకకు తిప్పుకొంటూంటే చంద్రిం సమ్మోహనశక్తివంతమైన తన కండ్లచూపులను అతనివంకకు ప్రసరిస్తూ అతనిమీదకు ఒరిగింది.

ఆనంద్ ఆమె భుజాలను తనవేళ్ళతో దగ్గిరకు లాగుకొంటూ ఆమె నున్నతమైన శరీరసౌరభ్యం మీదకు వేళ్లనడకలను సాగింపచేస్తుంటే, రహస్యస్థలాల తాకుళ్ళకు ఒళ్ళంతా ఝల్లుమంటూ ఆమె కుశిలిగింతలు పెట్టినట్టయి శరీరాన్ని దాచుకొంటూ నవ్వింది—

ఆనంద్కూడ ఆమెనవ్వుకు స్వరకలపి దూరంగా ఆమెను చేయి పట్టుకొని జామితోటవైపు లాగుకొని పోతూంటే చంద్రిం జారిన పమిటనైనా సర్దుకోనకుండా నవ్వుతూ అతనివెనుక పరుగెడుతూంది.

విరిపెద్దనవ్వులు తోటలోనిచెట్లను కదలిస్తున్నాయి.

ఆపరుగులో అతనికండ్లు వేటిమీదనిలచి ఆనందిస్తున్నాయో గుర్తించిన చంద్రిం అతనిని వెక్కిరించి నవ్వింది.

ఆనంద్ వెర్రిగా ఆమెను దగ్గిరకు లాగుకొన్నాడు.

కోయిల అరచింది.

చట్టున అదరుపాటున యిద్దరూ దూరమై పైకిచూచారు—

మరల అరచింది కోయిల.

చంద్రిం ఆనంద్లు నవ్వుతో అస్త్రాలన్ని విడచి దూరంగా నడచి పోతూన్నారు.

అంటే ఆకోకిలకూడ తమను ఆక్షణంలో చూడడం సిగ్గని ంచిందికాబోలు ఆప్రేమికులకు- అడ్డులేని ప్రేమలోకాని పోతున్నారు—

---

## 2

కస్తూరి వలన అంతాకలసి ఒకవేయి యిండ్లుగల పల్లెగ్రామం-

చంద్రం పుట్టి పెరిగినది ఆఊరులోనే...

చంద్రం చక్కగా పెద్ద వంశీయ సంతతికి చెందిన పిల్లలా చిన్నప్పటినుంచికూడ అగుపించేది-

ఆమె చేరదేసి నేత్రాలను చూచిన ప్రతివారూ మహాజ్యోతిష్యం తెలిసిన యతీశ్వరులుగానే అడగకుండ ఆమె అదృష్టవంతురాలని చెప్తూండడం మొదటినుంచే వాడుకలోనే ఉండేది.

యిప్పుడు చంద్రం వయసుపదునెనిమిది సంవత్సరాలుంటాయి.

మొదటినుంచి పల్లెటూరి వాతావరనంలో పెరిగిన చంద్రం చాల చలాకీగా కండపుష్టితో అగుపించేది.

ఆమె యౌవన తరుణపు బిగినిచూచి ఆశగా ఆమెవంకచూడని మగతనంగల మగాడు లేడు.

ఆమెతోమాట్లాడ ప్రతివానికీ కోరిక ఉన్నా ఆమెకు అందానికి సరితూగే పెంకితనం ఉండడంచేత ఆమెను చేరడానికి వెనుకంజ వేసేవారు.

ఆమె చనువుతోకూడిన పరిచయమంతా చిన్ననాటినుంచి ఆ ఆనంద్‌తోనే—

ఆనంద్ యె ఆమెకు తగిన ఉజ్జీఅనీ, అతనితోడి వివాహమే ఆతనికి తగుతుందనీ కస్తూరి వలసలో చిన్నలదగ్గర్నుంచి ముసలి ము తైదులు వరకు అనుకొనేవారు.

చంద్రం ఆనంద్‌ల అన్యోన్యత ఎరిగినవారి తలిదండ్రులు వారిద్దరికీ వివాహం చేయాలని మనస్సులలో అనుకొన్నా ఒకరినొకరు ఎదురుపడి అనుకొనలేదు.

ఆతరువాత ఆనంద్ పట్నం చదువుకివెళ్ళడం, అక్కడ దుర్వ్య సనాలకు చిక్కి పాడుఅయినాడని పేరురావడం జరిగినతరువాత చం ద్రం తలిదండ్రులు ఆసంబంధం పట్ల విముఖతచెంది తనకుమార్తెను మరొకవరునకు కట్టిబెట్ట నిశ్చయంలో ఉన్నారు.

బిళ్ళలులేక తిరుగగొట్టబడిన ఉత్తరాలలాగ తన్నుఅటగవచ్చిన సంబంధాలు నన్నిటినీ తిరుగగొట్టేసేది చంద్రం. ఆవయసులో యిం కా పెండ్లిలేకుండ ఉండకూడదని తలిదండ్రులు హెచ్చరించినా చంద్రం వారిమాటలను పెడచెవిని పెట్టేది. ఆమె ఆనంద్‌కి చేసిన బాసలు, అతనిభర్తగా కోరే తనహృదయనిశ్చయం ఆమెమనస్సు యితరవరుల మీదకు లగ్నమయ్యేదికాదు—

ఆనంద్ తనను మోసంచేయడని ఆమెమనస్సు ఆమెకు గట్టిగా చెవుతూండేది.

అతనికోసమే ఆమెమనస్సు ఆయత్తపడుతూండేది.

ఆనంద్ పట్నంనుంచి తిరిగిరావడం ఆనాటికి మరల వారు కలు సుకొన జరగడంచేత ఆపరస్పర ప్రేమికుల ఆనందం—

వేడుకతో పరస్పర కలియకను కోరే యువతీ యువకులకు సమావేశ సందర్భమైనప్పుడు అతిగాలమధురం నరాల బాధ—హృ దయవేగం రక్తంవేడిమీదే ఊహించాలి,

ఆనంద్ కస్తూరివలన మున్నబుగారి ఏకైక పుత్రుడు— చదువు సంధ్యలలో అంత నేర్పులేకపోయినా వేషభాషలలో మాత్రం పట్న వాసం స్టూడెంట్సుకు తీసిపోడు.

పచ్చని శరీరచ్ఛాయతో- నల్లగా మెలికలు తిరిగిన శిరోజముల అందంతో చంద్రంకు అన్నివిధముల తగిన జోడీగా అగుపిస్తాడు—

మున్నబుగారికి పదిహేను ఎకరముల ఫలసాస్యం ఉంది. ఆరాబడితో ఒకరికి చేయిచాచకుండ గౌరవజీవనం సాగిస్తూన్నారు ఆఊరిలో- అంటే- మున్నబుగారు ఆఊరిలోని మోతుబరులలో లెక్కగాకపోయినా హోదాను అండగా చేసుకొని మంచిపలుకుబడితోనే కాలాన్ని దొర్లిస్తూన్నారు.

ఆతని స్వల్పరాబడితోనే కుమారుడు ఆనందుని పట్నంచదువు కొరకు పంపడం, అక్కడ సరిఅయిన పద్ధతులలో చదువుపట్టుబడక ఆనంద్ పట్నంనుంచి తిరిగివచ్చివేయడం జరిగింది.

చంద్రం తండ్రికమ్మవృద్ధుడు- ఆయనపేరు రంగాప్రసాద్ కాని, ఆయనను "రంగా" అని మాత్రం పిలుస్తూంటారు ఆఊరిలో—

రంగాగారికి పదిఎకరముల పల్లంనేల ఉంది. ఆభూమి కాలువ గట్టునే ఉండడంచేతి వర్షములతో నిమిత్తంలేకుండ ప్రతిసంవత్సరం మంచి పంటపండుతూంటుంది. రంగాగారే పాలేరులనుపెట్టి స్వయంగా పంటలను పండించుకొనడం పరిపాటు—

చంద్రం మొగరాయుడులా చిన్ననాటినుంచి తండ్రికి తోడ్పడుతూ వ్యవసాయవ్యవహారములను ఆమెదగ్గరఉండి స్వయంగాచూచుకొనేది.

రంగాగారి ఏకైకసంతతికి పుట్టినది చంద్రంఒక్కర్తె అవడంచేతి ఆమె తలిదండ్రులకు ఆమెపట్ల అధిక అనురాగం- అయ్యి

ద్దును చెల్లించడమే వారిముఖ్య ఆశయంగా పెట్టుకొని ఆమెను అతిగా రాభంగా చూచుకొనేవారు—

ఆదినం మున్సబుగారు గ్రామసావడిలో విచారణలు ముగించి హాలులో కూర్చున్నాడు. ఆనంద్ అప్పుడే చంకలో పుస్తకంతో యింటిలోనికి వస్తూన్నాడు.

"ఆనంద్! యిదేనా భోజనానికి రాక! యిప్పుడు ఎంత అయిందో చూచావా?" అన్నాడు మున్సబుగారు.

"భోజనానికేగా! ఎప్పుడు వస్తేనేం! ఊళ్లేలాలా? ఉద్యోగం చేయలా?—"

"ఐతేమాత్రం- వేళకుభోజనం చేయవద్దటరామరి!"

"అందుకేగా చేరుకొన్నాను యింటికి!"

"ఎందుకూ ఆచురచురలు! మళ్ళీ పట్నంలో డబ్బుతగలేసిచదువాలని ఉందా?"

"అక్కడి చదువు అక్కర్లేదని ముందుగనే చెప్పాను."

"మరి?"

"అక్కడకు వెళ్ళబుద్ధి పుట్టదు. యింటిదగ్గరఉండబుద్ధీపుట్టదు. ఏమిచేయాలో అర్థంకాదు."

"అర్థంకాని దానికి మామీద చిరుగ్రమంటే ఏలా?" అన్నారు మున్సబుగారు- అంతలోనే తండ్రికుమారుల సంవాదమును వింటూన్న యింటి యిల్లాలు రత్నమ్మగారు చిరునవ్వుతో హాలులోనికి వచ్చి—

"ఆమాత్రం గ్రహించలేరూ? వాడికి ఏదో ఒకయింటిపిల్లను చూచి పెండ్లిచేస్తే ఆబంధంతో యిహాయిల్లు కదలకుండ దానినే అంటిపెట్టుకొని ఉంటాడని నాఅభిప్రాయం. పోనీ అలాచేసివేయకూడదూ? వయసువచ్చినవాడిని అలా నిర్బంధనలో పెట్టిఉంచితే పాపంకాదూ?" అని అంటూంటే మున్సబుగారు చిరునవ్వుతో

"నేనుమాత్రం వద్దన్నానటే! వాడుచెప్పకపోతే నాకేం తెలుస్తుందే వాడిగోడు!" అని తండ్రిఅంటూంటే ఆనంద్ అక్కడ నిలువకుండ తనగదివంకకు నడచిపోయాడు.

"వాడు ఏమనిచెప్పుకొంటాడు మీతో! పెళ్లాం కావాలని మీరుచెప్పుకొన్నారా మీచిన్నప్పుడు!'

"ఆనాటిరోజులే వేరు. ఇప్పుడు ఈవెధవలు కంటికినచ్చినదానిని తామే ఏరుకొని తెచ్చుకొని కట్టపెట్టమంటారు. పెండ్లికిముందు నిన్ను నేనుచూచే కట్టుకొన్నానంటావా?'

"ఏకాలం ముద్దులు ఆకాలంలోనే జరుగాలి. వాడుకావాలనేదానినే కట్టిబెట్టకూడదూ! నిశ్చింతగా యింటిలోనే పడిఉంటాడు. అప్పటితోగాని వాడికిసంసారబాధ్యతకూడ నెత్తికి ఎక్కదు-''

"నేను కాదన్నానా? సుందరయ్యగారి కుమార్తెను కోరియిస్తామంటూన్నారు. అన్నిలాంఛనాలు జరిపి వేయినూటపదహారులు కట్నం యిస్తామంటూన్నారు- పిల్లకూడ బాగుంటుంది—'

'వాడిచెవులో వేశారా?'

"అడిగాను- ఆమాట అసలు వినుపించుకొనన్లే జవాబు చెప్పకుండానే వెళ్లిపోయాడు'

"వాడికి రంగాగారి అమ్మాయి చంద్రంను కట్టుకోవాలని ఉంది. ఆపిల్లనుచూచి ఆనందించడానికే వారిపొలాలవంకకే పోతాడు మనవాడు—'

"అవును. అదీ విన్నాను- ఆపిల్లను వాస యివ్వడానికి అంగీకరిస్తే నేను మాత్రంవద్దంటూనా? రంగా తరువాత వారిఆస్తి అంతా చంద్రానికే చెందుతుందనే కారణంచేత కట్నములు అక్కర్లేకుండానే ఆపిల్లను కోడలుగా చేసుకొనడానికి చాలమంది అడుగుతూన్నారట—'

"అవును. డబ్బున్న సుందరపురంవారూ, మణ్యాలవారు ఇంకా చాలమంది అడిగినారట. ఆపిల్ల తలిదండ్రులు ఎందుచేతనో ఆసంబంధాలను త్రోసిబుచ్చారట"

"వాళ్ళగిరాకీ బాగుంది. పిల్లకూడ స్ఫురద్రూపి. పది ఎకరాల పల్లం ఎప్పటికైనా ఆమెకే దక్కే అవకాశంకూడ కనబడుతూంది"

"అందుకే అడగమన్నాను. వారు అంగీకరిస్తే—'

"అంతటి పెద్దసంబంధాలువస్తేనే త్రోసిబుచ్చినప్పుడు మనకు యిస్తారా ఆపిల్లని! అదిగాక మనవాడి ప్రవర్తన అప్పట్లో గుప్ మంది అనాస్త్రీఅనేవాడట! అరంగయ్య! పనికిమాలినవానికి వారి చంద్రిం భార్య కాలేదని—

"ముసలిదాని మాట ఆయింటిలో చెల్లేదేముంది!—అతని భార్య రామయ్యమ్మగారి అంగీకారం మీదనే ఆధారపడి ఉంటుంది ఆపిల్ల వివాహం—"

"మనవాడిలో ఏం గొప్పతనం చూచి మొగ్గుతుంది ఆమె మాత్రిం!—చదువా-సంధ్యా!— సేద్యమైనా చేయడం చేతరాని చవటవాజమ్మ మనవాడని వాళ్లకు తెలియదనుకొన్నావా!

"బాగుంది ద్యాంణీ!—మీరే యిలా తిట్టడం మొదలెడతే యిచ్చేవారయినా యిస్తారా పిల్లని!—"

"ఐతే—నీవే వెళ్లి—అడిగి—లేదనిపించుకొని రా!-"

"లేదనిపించుకోవడం ఏం!—తప్పక యిస్తారు-"

"ఎందుచేత ఆధైర్యం!—"

"ఇది ఊళ్ళో సంబంధం. కుమార్తె వారి కండ్ల ఎదుటనే కాపరం చేసుకొంటుంది. వారి యింటిలోనే చంద్రిం ఉండవచ్చును. కలసి వచ్చిన సంబంధంలా ఉంటుంది. పైగా చంద్రికు మన ఆనంద్ అంటే అభిమానం యిష్టంకూడ. వీడితో పెండ్లికి ఆ పిల్లకూడ అంగీకరిస్తుంది. అడిగి చూడండి— తిరువాత వాడి అదృష్టం—"

"చంద్రిను వారు యివ్వడానికి అంగీకరిస్తే వీడు అదృష్టవంతుడన్నమాటే ఈనాడే కదిపి చూస్తాను-'ఊ' అన్నారంటే వచ్చే శ్రావణమాసంలోనే వివాహం—"

'ఈ మాటలింటే మీ ఆనంద్ మీ కాళ్లకు నమస్కరిస్తాడు. వాడి మనస్సంతా ఆపిల్లమీదనే ఉంది—'

'ఇదంతా కాలమహిమ!—ఊ— కానియ్యి!—ముహూర్తం ఏర్పరచి రంగయ్యగారి యింటికి నేనే స్వయంగా వెళ్లివస్తాను."

——

## 3

"రంగయ్య తాతా!—"

"ఎవరు?—వీరన్న కాపా!—"

"చిత్తం. నేనేనండి—"

"ఏం!—పని మీద వచ్చావ్!—

"పనేముంది!—చూచి పోదామనే వచ్చాను-"

"ఊరకే రావు. నాకు తెలుసు- కూర్చో!- యిప్పుడు జమీందారుగారి కొలువులోనే ఉన్నావా!-"

"ఆ! అక్కడనే పనిచేస్తూన్నాను. జమీందారుగారంటే జ్ఞాపకం వచ్చింది, యిప్పటి యువరాజుగారికి అస్తమానం మీమాటే!—మీగురించి!"-

"మనుష్యులను గురించి ఆయనకేం తెలుసు!—వింతగా మాట్లాడుతూన్నావే!—"

"వింత ఏముంది!—మీ యింటికి అదృష్టం పట్టనుందని గ్రహించాను—"

"అదృష్టమా?—"

'అవును. యువరాజాగారు మంచి ధర్మప్రభువులు. ఆయన ధర్మానికి అడ్డులేదు. మొన్న ఒక బీదముసలిదానిమీద కనికరం కలిగి రహీంతాపురంలో ఐదు ఎకరముల పంటభూమి వ్రాసి యిచ్చి వేశారు. మొన్న ఒక బీదవాడు యాచనకు రాగా వంద రూపాయలు పారవేశాడు—"

"అంత మంచివాడా?—"

'ఏమిటమాట! అసలు ఆయనముఖంలోనే ఉంది. ఆలక్ష్మీకళ. అతని అందాన్ని చూస్తూంటే మగాళ్ళకే వ్యామోహం కలుగుతూంటుంది. పరకాంతలంటే అసలు కన్నెత్తిఅయినా చూడని సహృదయుడు—'

"సముద్రం అవతల చదువుకికెళ్లి వచ్చాడంటారే ఆయన. వయసుకూడ ముప్ఫై సంవత్సరములకు మించిఉంటాయనే అనుకొంటారు. ఆయనను చూస్తే తండ్రిని చూడనక్కరలేదట కదూ!

'అవును. ఆయనకీవి అంతా ఆతనిలోనూ ప్రతిభవించి ఉంటుంది ఖర్చుకి వెనుదీయని జల్లాదారుడు.'

'ఆయనతండ్రితో సమానవయస్కుడులాగే అగుపిస్తాడటకదా!

'అవును. ఆయింటినంరక్షణలో అలాగేఅగుపిస్తారాయన'

"వీరన్నా! నీవుఆయననుగూర్చి అంతమంచివాడని చెపుతావ్ ఊరిలో మరోకలా అనుకొంటారు—"

"ఇదిగో తోకఅంటే- అదిగో పులిఅంటారు. ఆయనదగ్గరఉండి పనిచేస్తూన్న ఆయన మంచిచెడ్డలు నాకంటే పైవారికి ఎక్కువ తెలుస్తా యంటారా?"

"అవును. ప్రస్తావనలో అంటూన్నాను. ఆయన ఎట్టివాడు అయితే మనకేం కావాలి!"

'అంతేలెండి, కాని- బుద్ధిపుట్టి ఒకరిమీద అభిమానం కలిగిం దంటే శరీరం కోసియిస్తారు. ఆయింటికి బంగారుగోడల్ని కట్టిసారు'

"త్రాగుడు అలవాటు ఉందటకదూ!"

"దారిద్ర్యం పుచ్చుకొంటారు. ధనికులు- వారికి ఎట్టి అల వాటులున్నా దోషంలేదు—

'కావచ్చును—"

"మీ అదృష్టం పండింది. మీమీద వారికిఅనుగ్రహంకలిగింది.

'ఆయనకు మామీది అనుగ్రహమునకు కారణం!"

"యినాంగా కొన్ని ఎకరములు మీ పేరను వ్రాస్తా మంటూ న్నారు. మీపల్లంభూమిమీద విధింవబడిన అధికపన్నులను ఈశ్యాం పులోనే తగ్గించివేస్తానన్నారు. మీరువచ్చి చెప్పుకొండి రంగయ్యా గారూ! నేనుకూడ ఉంటానుగా—"

"మామీదవారికి అట్టిఅనుగ్రహం కలుగడానికి కారణం!"

'చెప్పమంటారా? మీరు మరోలా ఎంచవద్దు. నేను మీ బిడ్డవంటివాణ్ని. నేను ఎవరితోనూ ప్రాణంపోయినా అనను. ప్రభు వులతోటిమాట. వచ్చే అదృష్టాన్ని ఈస్థితిలో ఆపకూడదు.

'అనలువిషయం చెప్పడంలేదు.'

'ఆయన పరస్త్రీలను కన్నెత్తిచూడరని చెప్పానుగా!"

'అవును. ఐతే!—"

'మొన్న చంద్రిం పొలమునుంచి పశువులను తోలుకొనివ స్తూంటే యువరాజాగారు క్యాంపు గుడారంలోనుంచి చూచారట. అప్సరస కాంతలాంటి మనచంద్రిం సోయగం అతనిని కవ్వించి వ్యా మోహ పరచింది. ఎన్నడూ చలించని వారిమనస్సు ఈనాడు చలిం చింది—"

'ఐతే ఏమి చెప్పవచ్చావు వీరన్నా —

'ఆలోచించండి. ఈసంగతి ఎవరికీ తెలియదు. ఆమె భవిష్య త్తుకు అన్యాయం జరుగకుండ రహస్యంగా ఆయనతో ప్రాపకం సంపా దిస్తె మీరు కుబేరులు అవుతారు. ఆయనను చూచిందంటే చంద్రం కూడవప్పుకొంటుంది. ఏదో నాలుగుడబ్బులు ముట్టెఅవకాశము వచ్చి నప్పుడు వదులుకొనగూడదు—''

'వీరన్నా! మేము సంసారులమని తెలుసునా? వాడికి బుద్ధిలేక పోతే నీబుద్ధి ఏమైంది! వారు అట్టివారు కారని ఆయనకు చెప్పవద్దా?'

"చెప్పాను. ఎంతచెప్పినా వినేపద్ధతిలోలేరు. ఒక్కమాటు చంద్రింవస్తె ఎంతసొమ్ము అయినా యిచ్చుటకు—'

'చాలు వీరన్నా! డబ్బుకొరకు యోచించి శీలం పాడుచేసుకో మని నీవుకూడ సలహాయిస్తూన్నావా? మున్సబుగారి అబ్బాయితో చంద్రిం వివాహం స్థిరపడింది. వివాహం కాబోయేకన్య జీవితంపాడు చేయడం ప్రభువులకు ధర్మంకాదు—''

'ఈసంగతి మరియొకరికి తెలియకుండ జరిగిపోయే అవకాశం నేను చూపుతానుగా!''

'యిహ ఆమాటలుకట్టిపెట్టు. కూటికి పేదనైతే కులానికికాదు వంశ గౌరవం అవసరం. మాదిభోగం కులంకాదు. వెళ్లువీరన్నా— ఈమాటలతో మరల మాగుమ్మం ఎక్కకు.''

'రంగయ్యగారూ! కోపించకుండా కొంచెం యోచించండి. చం ద్రిను ఆయన సులువుగా వశపరచుకొనగలగలరు. కాని—'

'ఆ! ఏమంటూన్నావ్!''

"యువరాజాగారు స్వయంగా చంద్రిను ఎదురుపడి అడిగితే ఆమె అంగీకరించి తీరుతుంది. యౌవనంలోఉన్న చంద్రిం ఆతని ఆనందానికి ముగ్ధురాలై—'

'వీరన్నా! జాగ్రత్త! మాచంద్రిన్ను అంత తేలికగా ఎంచ వలదు—''

పెండ్లి ప్రయత్నం లేకుండానే ఆనందంతో రహస్యంగా సంభోగసుఖాలను అనుభవిస్తూన్న చంద్రం యువరాజు కోరికను తోసిపుచ్చగలదా?

"వీరన్నా! ఈనాడు మాకుటుంబ గౌరవమును పెరికివేయు నిశ్చయముతో యిక్కడకువచ్చి వాదనకు దిగుతూన్నావా?"

"కాదు—ఒక్కమాటవినండి. మీబాగునుకోరి యిచ్చుటకు వచ్చాను- ఈరహస్యం ఎవరికీ తెలియకుండ కాపాడుబాధ్యత నాది. ప్రమాణంచేసి చెవుతూన్నాను. ఈరహస్యం ఆమె పెండ్లికి అడ్డు రాకుండ—"

"నీచుడా! రంగా అంటే ధనాశాపరుడనే నమ్మకంతో యిక్కడకు వచ్చారా? కులస్త్రీలను చెరుపచూచే పిశాచరుడవానీవు? రక్కసుడా! నాఅరుగు దిగు—" అని రంగా పౌరుషంగా బెబ్బులిలా ముసలికంఠంతో గద్దిస్తూంటే—

'రంగా బాబూ! యోచించండి. ప్రభువులు తలచుకొంటే- దెబ్బలకు కొదువయుండదు. అల్లరికాకుండ రహస్యంగా జరిగిపోతే చంద్రంజీవితానికి భగ్నంరాకుండా నేను బాధ్యతవహించిచూస్తాను. లేదా— ఆమె యువరాజాగారి చేతిలోనుంచి"

'ఛీ! పశువా! యువరాజుఅని భయపడి శీలం బలిచేసుకొనే నీచులంకాదు. ఉత్తమవంశీయులం. అకారణంగా అవినీతిమార్గంలో రాజుప్రవర్తించడం అరాచకం- అన్యాయంకూడ—

'పల్లెలలో ఈపాటలు సాగిరావు. మీకుటుంబమునకు కొంత రాబడినిచూచి—"

"ఛీ! దుర్మార్గుడా! నోరెత్తితివా తలపగులుతుంది-" అని ముసలితనంగా గారుకర్రను తీస్తూంటే వీరన్న వినీవినిపించనట్లు నోటిలో గొణుగుకొంటూ అక్కడనుంచి నడచిపోయాడు.

రంగా కేకలు విన్న అతనిభార్య రామయమ్మ తొందరగా

వీథిలోనికి వచ్చునప్పుడే పశువులను పొలంనుంచి తోలుకొనివచ్చిన చంద్రంకూడ అరుగు ఎక్కింది.

'ఎవరిమీద ఆ కేకలు!'

"వెధవ! వెర్రికూతలు కూశాడు. తగిన బుద్ధిచెప్పి పంపాను."

"ఎవడు? ఏమన్నాడు?"

'వీరన్న వెధవ! పిల్లిలావచ్చి పులిలామాట్లాడాడు"

'ఏమన్నాడండీ!"

'అమ్మాయి విషయంలో వెధవ నీచంగా మాట్లాడాడు. ధనం ఆశచూపి తాగుబోతు యువరాజునంగతి నాతో చెప్పవచ్చాడు—'

"అంటే!"

'నాకు అర్థమైంది. రాఅమ్మా- నేనువినిపిస్తాను-' అంది చంద్రం అంతాగ్రహించినట్లు—

'ఎక్కడికి రావడం! యిక్కడవినిపించకూడదా!"

"యువరాజు నన్ను కోరుతూన్నాడని వాడే నాతో వేడుకగా వినిపించబోయాడు. నేను మొగమువాచేటట్టు చీవాట్లువేసి పంపివేశాను. తాను తెలియక అడిగినందులకు నన్ను క్షమాపణ కోరుతూ నిన్న వెళ్ళిపోయాడు. ఈదినం నాన్నతోకూడ ఆమాటలే మాటాడ వచ్చినట్లున్నాడు-"

'పిడితల అమాంతంగా భగవంతుడు నరకా! యివామాటలు వీడుపట్టుకొనివచ్చింది! ఇట్టివృత్తులుచేసే అజమీందారుల డబ్బులో యిండ్లునింపుకొని యిండ్లుకొనుక్కొంటూన్నాడు. లేకుంటే కానీరాబడిలేని ఈవెధవలకు ఈకొద్ది దినాలలోనే యింతఆస్తి ఎకకడనుంచి వస్తుంది. అన్నారు రావమ్మగారు.

"పాపపు పనులకు చోరబడి, మానవత్వమును మరచిచరించే నీచులు ఎంతడబ్బుగడిస్తేమాత్రం ఫలితం ఏముంది? సంసారులను చెర

వచూ్చే దుర్మార్గులు అపావఫలితం యిహంలోనే పొంది తీరుతారు—
అన్నారు రంగాగారు దుర్వాసునిలా శపించే కంఠధ్వనితో—

"ఆత్మవంచన చేసుకొని బ్రతికే నీతిలేని వెధవలకు యముడు
కూడ జడిసే దూరంగా ఉంటాడు. అందుచేతనే అట్టివారు చిరంజీవులై
ప్రపంచంలో నిలచిపోతారు—" అంది రామమ్మగారు.

'వెధవ! చచ్చునాగమ్మ! ఈమారు అరుగుఎక్కనియ్యి పేడ
నీళ్ళుచల్లి పంపుతాను-" అని కసురుకొంటూ రంగయ్యగారుఇంటిలో
నికి నడుస్తూంటే చంద్రం రామమ్మగార్లు ఆయనను అనుసరించారు.

♦ ♦ ♦ ♦

"వీరన్నా—!'

"ప్రభూ!—"

"కాయా? పండా?'

"మొదటిమాటేనండి-"

"అంటే?"

'కాయఅన్నమాటేనండి ప్రస్తుతం-"

'అది ఎంతలోమాటని ఆశచూపావ్ కాదోయ్!"

"అనుకొన్నానండి. యౌవనబిగిలో పోతరించి ఉంది- మీలాంటి
అందగాళ్ళమాటచెప్పి కైపుఎక్కిస్తే ఒప్పుకొనపోతుందా అని అను
కొన్నాను—'

"ఇప్పుడు ఏమైంది. ఆమె తండ్రి ఒప్పుకొనవచ్చన్నావుగా!'

ప్రభువువారి మాటంటే కట్టుబడతారనుకొన్నాను. ఏమి ఆశ
చూపినా ఆగకుండ తిట్టి పోశాడండి ఆముసలిగాడిదకొడుకు! వాడి
గర్వానికి ప్రాయశ్చిత్తం జరుపకుండ-మనం ఆపకూడదండి."

"ఊ! సరే—"

'ఆముసలాడు మనకాళ్ళదగ్గరకువచ్చే విధానం చూడలేరండీ
బాబయ్యా!"

'అది యిప్పట్లో- తొందరలో జరుగుపనికాదు. బుద్ధిబలము ఉపయోగించి చేయాలి ఏపనిఅయినా-'

'చిత్తం. అప్పటివరకు ఆచంద్రం మనదేరాకువచ్చే అవకాశం అగుపడదు—'

"యింకఏమీ ప్రయోజనం లేదంటావా!"

'లేదండి. ఆమున్సబుగారి కొడుకు ఆనంద్ అనే కుర్రాడితో దానిపెండ్లి స్థిరపడింది. ఆపిల్లకూడ ఆకుర్రాణ్ని కోరుతూండడంచేత ఆవివాహం వచ్చేనెలలో చేయునిశ్చయంలో ఉన్నారట.'

'ఆమెను స్వీకరించుకొను విధానం కోసమే యోచిస్తూ యున్నాను-'

"అది చాల పెంకిరకం పిల్లండి. సాధారణంగా చిక్కేరకం కాదు. అంతికంటె మంచిపిల్ల ఉందండి. మనపిచయను పౌంకంయాదు మూర్తులా అలాగే ఉంటుందండి. కాని రంగుమాత్రం కొంచెము నలుపు—'

"ముహంలోకూడ అంతటి అందం ఎల్లైగ్రామంలో ఎవరికీఉండ దనే నావిశ్వాసం.'

'చిత్తం. ఆమాట నిజం. ముహంలో అంతటి కళ ఉండకపో యినా నేను చెపుతూండే పిల్లమాత్రం వయసులో ఖాకునచ్చుతుంది.

'ఎవరోయ్ మరి ఒక తె!—'

'కావలిస్తే నందలడిన తరువాత తమ గుడారానికి వెంటపెట్టు కొని—''

'అసలు ఎవరు ఆమె! యిప్పుడు ఎక్కడఉంటుంది!'

'పొలానికి పోతుందండి. యిప్పుడు అగుపడదు''

"దానితలిదండ్రులు ఎవరు? అదిమాత్రం సులువుగా వస్తుం దని నమ్మకం ఏమిటి!'

దానిసంగతినాకు తెలుసునండి. నామాటంటే అది కొట్టివెయ్యదు రాత్రివేళ వచ్చుటకు ఆమె తలిదండ్రులు—

అదంతా తమకు అక్కర్లేదు. నేను తెచ్చి మీముందు ఉంచు తాగా! ఆధైర్యం ఉంది కాబట్టే ధీమాగా చెపుతూన్నాను. రాత్రి వేళ అది ఎక్కడకు తిరిగివచ్చినా దానిమొగుడుకూడ దానిని అడ్డు పెట్టడు. ఏదో మిష చెప్పి నేను తెస్తానుగదండీ! చంద్రం విషయంలో ప్రయత్నం రైటుకాకపోతే అన్ని కేసులలోనూ అంతేనంటారా—! వీరన్న చేతిలో—

అంత నిర్భయంగా గలిగే ఆమనిషి ఎవరోయ్! నాకు ఇప్పటి వరకు ఏల తెలుపకుండ ఉపేక్ష చేశావు.

తమరు చంద్రం ఎగిలో ఉన్నారని ఆ ప్రయత్నంలో ఈ కేసు సంగతి చెప్ప మరచాను. అదిగాక ఈమనిషి మనం ఎప్పుడు రైటంటే అప్పుడే వచ్చేరకం కాబట్టి కొంచెం నిర్లక్ష్యంతో ఊరుకొన్నాను.

దానిభర్త వ్యవసాయదారుడేనా?'

పూర్ణయ్యగారి పొలంలో పనివాడు.'

అంటే- పాలికాపా?

చిత్తం—

వాళ్ళకులం.

అగ్రజాతివారండి.

మాల వాళ్ళా?

చిత్తం. మనకు మనిషితో నిమిత్తంగాని కులముతో ఏంపని!

వీరన్నా! నన్ను నీదృష్టిలో చులకనచేసుకొన్నావ్.

ప్రభువులు! అలా అన్నారేం.

నీచపు ముండలతో సాంగత్యమును కోరుతూన్నావని నీ తలంపా—?

లేదు ప్రభూ! సముద్రం అవతలదొరసాని అమ్మలతో పూర్వ సాంగత్యం ఉన్న తమకి కులవివక్షతతో నిమిత్తం లేదనుకొన్నానండి-

కావచ్చు. ఆదొరసానులకు వీళ్ళకూ పోలికయే ఉండదు. శుభ్రతఎరుగని ఈమాలముండలతోనా నాకు సాంగత్యం——

ఈమాలదికూడ సంసారికమేనండి.

సంసారి మనతో ఏలవస్తుందని నమ్ముతాను నేను!

అబద్ధం చెప్పను ప్రభువుల దగ్గర.

సింహం కోరిందా ఏనుగుకుంభస్థలమునే కోరుతుంది. నక్కవలె నానారకం మాంసములను కోరదని నీవుగ్రహించినప్పుడే నీవునా వద్ద ఉద్యోగమునకు అర్హుడవుకాగలవు.

చిత్తం. పొరపాటు పడ్డాను. క్షమించాలి.

చంద్రం తప్ప యితరుల మీదికి నామనస్సుపోదు. ఆమె నాకు అనుకూలపడు విధానంకోసమే మనం యోచించాలి.

చిత్తం. మీరు ఏలా ఆజ్ఞయిస్తే అలా నడచుకొంటాను.

ఆమెనుంచి నామనస్సు త్రిప్పుకోలేక పోతూన్నాను. తొందరలో ఆమెను అనుభవించు సుఖంకోసం నామనస్సు ఆతృతపడుతుంది.

బాగా యోచించాలి. అది చాల పెంకిరకంపిల్ల. చిన్న ప్రయత్నాలతో సాధ్యపడినదికాదు.

అవును. ఆమె పెంకితనమే నన్ను మరీ ఆకర్షనీయునిగా చేస్తూంది. ఆమె నావశం చేసుకొని జీవితమంతా అనుభవించాలనే తృష్ణ నన్ను బలవంత పరుస్తూంది- నాకు వివాహమే జరిగియుండకపోతే ఆ చంద్రంనే వివాహం చేసుకొనే వాడ్ని——

ప్రభువులకు ఒక సామాన్యకాంతతో వివాహమా?

“చలాకీగా —— పెంకిగా చూచే ఆమెచూపు—— ఆకండ్లలో మెరసే నిరంకుశత్వం- యౌవనశోభను పరిమళింపచేసే ఆమెఉరభాగపు వంపులు నాలోఎన్నడూ కలుగని ఎరుగని ఉత్తేజాన్ని కలిగిస్తూ

బాధింపచేస్తూందంటే ఆమె సామాన్యకాంత అంటావా! స్త్రీసంఘో గసుఖరహస్యం ఎరిగిన ప్రతిపురుషుడు ఆమె పాదాలముందు సాష్టాంగపడి ప్రార్థింతుడు కావలసిందే అని నేను చెప్తూన్నానంటే అతిశయోక్తి కాదు. ఆమెనుచూచిన మొదటిచూపులోనే పరవశుణ్ణయినాను. దానికి తోడుగా ఆమె విశాలనేత్రముల—"

బాబూ—!

'వీరన్నా! మోహాపూరితమగు నామనస్సు ఆనిమిషంనుంచి పుష్పంవంటి ఆమెకోమలమైన ముఖంనుంచి మరలలేకుండా ఉంది. మరువలేని మాయామోహినిలా నన్నుకట్టుకొన కలిగింది."

ప్రభువులు యోచించాలి. త్వరలోనే కోరినవరుని వివాహం చేసుకొనబోతూన్న చంద్రం మీతో పరిచయానికి అంగీకరిస్తుందని నాకు తోచదు. బలవంతంమీాదగాని పనిజరుగనట్లు నాకుతోస్తుంది."

'బలవంతంవల్ల అల్లరికాగలదు. అంతకంటె మంచిమార్గములు అనేకం ఉన్నాయి—' అన్నాడు జమీందారీ విశ్వాసరావు.

"మంచిమార్గములా?"

"అవును వీరన్న! చూస్తావుగా—

'చెప్పండి బాబయ్యా— ఆమంత్రం, నేనుకూడ ఆమంత్రాగ్ని పఠించి ఆంజనేయుడు సంజీవిపర్వతం తెచ్చినట్టుచంద్రంనుఎత్తుకొని వచ్చి మీాముందు ఉంచుతాను—'

"అదికాదులే విధానం- మాయోపాయమే ఈపరిస్థితులలో అవసరం—"

"రావణాబ్రహ్మలాగన్న మాట!"

"అవును. ఎంతటి పతివ్రతనైనా మనం తలచుకొంటేపట్టి యిచ్చుటకు రప్పించే యుక్తినాకు తెలుసు!"

"వినిపించి నాకుసంతసం కలుగచేయకూడదా ప్రభువులు!"

"నీనంతనం నాకు అవసరంలేదు. చూడువీరన్నా— ఆచంద్రిం సాయంత్రిం చీకటివడబోవు ముందు పొలంలో ఉంటుందా?"

"ఊహూ- సందలడే వేళకు యింటికిచేరుకొన పొలంనుంచి బయలుదేరి పోతుందండి—'

"అదే! ఆవేళలో పొలంనుంచి యింటికి తిరిగివస్తుందిగదా?

"ఆ! తమ యింటి పశువులను తోలుకొని యింటికి విధిగా వస్తుంది.'

"మంచిది! ఆమెపొలంనుంచి రాకపోక తోవ్రిలునాకు ఎరిం గించాలి—'

"ప్రిభువులు యిప్పుడువస్తే చూపుతానండి. తమ ఆజ్ఞకాదన గలనా!"

"నీలకంఠ రావునుకూడ నేను రమ్మన్నానని యిప్పుడే తీసుకొ నిరా! ఆబాటలు మనంవెళ్ళి చూచిరావచ్చును."

"రావుగారిని మనతోడనే తీసుకొని వెళ్ళుటకు పిలచుకొనిరా వాలా—!"

"అవును. ఆయనకూడ ఆబాటచూడాలి."

"చిత్రం. ఆతడుచూడడం అవసరం? బలవంతంగా దారికాసి మోసుకొని రావడానికా? కండపుష్టిలయినాలేని నీలకంఠరావుగారు ఏమిచేస్తారండీ!"

"నీలకంఠ రావుతో తొందరగా రావాలి. ఈలోగా గుఱ్ఱం తీసుకొని యిప్పుడే వస్తాను—"

"చంద్రిం యిప్పుడే పట్టుకొనే ప్రియత్నమా ప్రభూ!'

"కాదు. బలవంతంమీద పట్టుకొనడం మాపద్ధతికాదు. రేవు నేను చేయబోవు మాయోపాయానికి నీలకంఠం అవసరం ఉంది—'

"ఆమాత్రంపని నేను చేయలేనంటారా? నేను చేయ్యలేనిపని నీల్ల కంఠం చేయ్యగలడు అంటారా!"

నీవు ఉండనేకూడదు. ఈఉపాయంలో నీవు అగుపడుతే పని చెడుతుంది—'

"చిత్తం. మీరు ఎక్కడ ఉండమంటే అక్కడనే ఉంటాను.'

---

# 4

"ఆగు- చంద్రం—'

"ఎవరునీవు? ఎవరితో మాటలాడుతున్నావ్!'

చంద్రం- అని పిలచేగా ఆగమన్నాను-

"నాపేరును సంభోధించి నన్ను ఆగమని చెప్పే నీవు ఎవరవు!

'కనిపించడంలేదా? మనుష్యుడను. అందులోను మగవాడను. మగాడు ఆడదానిని ఏకాంత సమావేశంలో ఆగమనడంలో తప్పే ముంది? సృష్టినైజంకదా?'

"అసందర్భముగా నోటవచ్చినట్లు పేలితే కొన్నివండ్లు ఊడ గలవని చెపుతూన్నాను-"

నీవు యిప్పటివరకు ఆజామిచెట్టు నీడలో ఎవరితో మాటాడు తూన్నావో నాకు తెలుసు- ఒకకన్య వివాహానికి పూర్వ మగాడితో మాటాడవచ్చునా? ఆతనితో అంత నీవు ఆనందంగా మాటాడిన నీవు నాతో అరగడియ ఆనందంగా ఉండటానికి సంకోచం దేనికి!—'

"పెండ్లికి ముందుగనే గర్భాదానసుఖమా?-"

'ఛీ!—పశువా!—నా త్రోవకు అడ్డం నిలువకు. నీవు ఎవ రవ్!—జమీందారు చేత పంపబడిన కిరాతుకువా నీవు? జాగ్రత్త!-"

"జమీందార్!—వాడు ఎవరు!—వాడితోకూడ నీకు సంబం ధముందా! —కాకాలు వారి ఉన్నమే!"—

'నోటికొచ్చినట్లు వదరక తోవనుంచి తప్పుకో!- పశువులు ముందుకి పోతూన్నాయి—"

"వాటికి యింటి త్రోవ తెలుసు. నిన్ను నాకోసమె విడచి పోతూన్నాయి నీపశువులు—"

"ఏమిటిరా ఈమాటల చొరవ!—"

"చొరవకు ఏముంది!—మాటలతో వినకపోతె బలవంతం—' అంటూ ఆమె గాజులచేతిని పట్టుకోనబోయాడు—"

చంద్రం తోకతొక్కిన త్రాచులా ముందుకువచ్చి గట్టిగా అతని దవడమీద 'చళ్' న లెంపకాయ కొట్టింది.

చంద్రం అతనితో ఆఖరు నిమిషంవరకు పెనుగులాడుతూ తోటలు ప్రతిధ్వనించునట్లు ఒకటి, రెండుమారులు అరచింది. కాని- అరవకుండ ఆమె నోటిని అతడు నొక్కి-వేయడంలో అలసటతో గట్టిగా అరవలేకపోయింది చంద్రం—

ఆ పెనుగులాటలో అలసిన ఆమెను అతడు పశుబలంతో ఆక్రమించుకొన్నాడు.

చంద్రం మరల రక్షణకొరకు కేక లేసింది.

జమీందార్ గుర్రపుస్వారి చేసుకుంటూ చంద్రం నిర్బంధింపబడుచున్న తావుకు వచ్చి నిలబడ్డాడు.

ఎవరది!—ఆ కేకలు పెట్టింద ఎవరు!—" అని గర్జించాడు గుఱ్ఱంమీద ఉన్న జమీందార్ విశ్వాసరావు.

భీతిగా అతనివంక చూస్తూ దూరంగా లేచి నిలువబడ్డాడు. అప్పటివరకు చంద్రంను నిర్బంధిస్తూన్న ఆ పశుకాముకుడు.

చంద్రం తన చీరను సరిజేసుకొంటూ పౌరుషంగా

"చూడండి!—ఈ దుర్మార్గుడు వంటరిగా పోతూన్న నన్ను నిర్భయంగా చరబట్ట చూస్తున్నాడు. ఎంత అరచినా విడువకుండ బాధించాడు. మీరు రాకుంటె నాప్రాణమే పోయేది—" అని చెప్పు

తూంటే, ఆమె మాటలతో ఆ జమీందార్ ముఖంలో కోపమును సూచిస్తూ—

ఎవడవురా! నీవు!—పశువా!—దారివెంట పోయే స్త్రీలను బందిపోటుగా దారికాసి పశు కామముతో పట్టుకొనచూచే నీవు ఎవరవు!—" అని గర్జించాడు—

"ప్రభూ!...ఈమెను నేను మోహించాను. విరహం అణచుకొనలేక దీనిని అనుభవించే వాంఛతో—"

"నోరుమూయ్!— నీ విరహం తీరడానికి మృత్యుదేవతను కౌగలించుకో—దుర్మార్గుడా!—" అంటూ జమీందార్ తన జేబుల నుంచి పిస్టలును లాగి, ఆతనికి గురిచూచి 'ఫాం' మనిపించాడు.

ఆ దెబ్బతో ఆ కాముకుడు హాహాకారములతో నేలమీదకు ఒరిగి విల విల తన్నుకొంటూన్నాడు. చంద్రిక ఆశ్చర్యంగా ఆదృశ్యాన్ని చూస్తూన్నప్పుడు ఆమె ముఖంలో భీతిసూచన రేఖలు అగుపించాయి.

"ఏమిటి! హత్య!!'

అవును. నిన్ను బలవంత పరచినవానికి అట్టి శాస్తి జరగావల్సిందే'

ఈనేరం నామీదనా—!

భయపడకు. నేను యిప్పుడే తప్పించుకొని పోగలను. కాని—నీరాక ఈతోటనుంచి ఎవరైన గమనించిన నీకు ముప్పురాగలదు. జాగ్రత్త! నేను వెడుతూన్నాను.

'ఆగండి- నాకు భయంగా ఉంది. నలుదిక్కులా చీకటి అలుముకొనే ఈసమయంలో యిచ్చట నిలువలేను. తోటదాటువరకు మీారు సహాయంగా ఉండవలసినదిగా—

అదిగో పిస్టల్ షాట్ శబ్దానికి ఎవరో కొందరు ఈవంకకే పరుగెత్తుకొని వస్తూన్నారు. ఈశవం సమీపంలో నీవు ఉండకూడదు. రా! ఈగుర్రంమీద కూర్చో- రక్షించి నియింటివద్ద దిగువిడుస్తాను.'

గుర్రంమీదనా! నేనా—!"

త్వరపడాలి. యోచనకు యిహ కాలంచాలదు. నిజం తేలువరకు ప్రభుత్వం నిన్ను ముందుబంధించి తీసుకొనిపోతుంది. దీనివల్ల నీముసలి తలిదండ్రులకు బెంగకలిగించినదానవు కాగలవు—

మీరు—

మీయింటిసమీపంలోనే నిన్ను విడుస్తాను. అనుమానించకు. ఆపదసమయం త్వరపడాలి—" అని తొందరపరుస్తూ జమీందారు విశ్వానరావు ఆమెను తన గుర్రం ముందరభాగంలో కూర్చుండబెట్టుకొని గుర్రమును పరుగెత్తిస్తూంటే స్వయంవరంనుంచి రాణిసంయుక్తను పృధీరాజ్ తన గుర్రంమీద కూర్చుండబెట్టుకొని తనరాజ్యమునకు గొంపోయిన దృశ్యం జ్ఞప్తికివచ్చింది.

—

## 5

జమీందార్ విశ్వానరావేనా?

అవును. దుర్మార్గుడు. మోసంచేసి తనబంగళాకు నన్ను మోసుకొనిపోయాడు—

రాత్రంతా- అచ్చటనేనా?

ఏమిచేయను? అక్కడ నన్ను రక్షించేది ఎవరు?

దుర్మార్గుడు! ఎంతటి ఘోరానికి సాహసించాడు!

త్రాగుబోతు! తుంటరి! నీచుడు—

అమ్మాయి! నిన్ను— వాడు—

ఆ! చెరచాడు. జంతువులా నన్ను ఉపయోగించుకొన్నాడు. కానీ అదిదొంగమాటలతో భయపెట్టి—

ఏడువకు తల్లీ! భగవంతుని యిష్టానికి మనము వ్యతిరేకించ లేముకదా!

కళంకినగు నన్ను ఆనంద్ అంగీకరిస్తాడా?

అమ్మాయి! ఈసంగతి వాళ్ళవరకు వేలా వెడుతుంది! జమీందారు వారికి తెలియబరుస్తాడంటావా?

వాడు తెలియచేయనంతమాత్రంలో నాకళంకం నన్ను విడచి పోతుందా? పతితనగునాకు—

అమ్మాయి!

ఈకళంకం దాచుకొని ఆతనికి మోసాన్ని జేయలేను. నన్ను ప్రేమించి నమ్ముతూన్న ఆనంద్‌కు నేనే మోసం చేయతలవడాలా— అంటూ కళ్ళనీళ్లు పెడుతూంటే —

పిచ్చిపిల్లా! వాళ్ళకుచెప్పుకొంటే నీకళంకం తీసివేస్తారా? నీజీవితం అల్లరిపాలు చేసుకోవడం కాదా?

ఈఅగ్నిపర్వతాన్ని రహస్యంగా నామనసులో ఎంతకాలం యిముడ్చుకొని ఆయనకు మోసంచేయగలను! నన్ను విశ్వసించి వివాహమాడచూచే ఆనంద్‌కి నాకళంకం తెలుపుకొనకుండ ఆతనిని దగా పుచ్చలేను—

దీనిలో మోసంగాని, దగాగాని ఏముంది! నీవు మనసుతో చేయని నేరానికి నీవాభాధ్యురాలవు! అందువల్ల నీభర్తకు నీవుమోసంచేసినదానవు కానేరవు —

అమ్మా! జరిగిననేరాన్ని ఆయనకు విన్నవించుకొని, నిరపరాధినని నిరూపించుకొని ఆయనయిష్టతతో వివాహం చేసుకొనడంలో శాంతిఉంటుంది- అప్పుడుగాని ఆవివాహం నాకు తృప్తిగాఉండదు. నాకళంకం ఆయనముందు మధ్యవరది దాచుకొనలేను.

"పిచ్చిదానా!—నిజ విషయం ఆతనికి ఎరింగిస్తే మగవాడు స్వార్థబుద్ధితో క్షమించగలుగుతాడా?- నీకు ప్రపంచ అనుభవం

చాలక అలా మాట్లాడుతూన్నావు. అతడు ఈర్ష్యావేశంతో న్యాయాన్ని గుర్తించలేక స్వార్థబుద్ధితో నీతో వివాహం అతడు వదలుకొన్నాడంటే నీ స్థితి ఎట్లు మారునో యోచించుకో!- అతనిచేత నిరసింపబడిన నీకు మరి ఎవరితోనూ వివాహం జరుగకుండ కూడ అటంకానికి కారణమౌతుంది!-వంశం గౌరవం నాశనమౌతుంది. ఈ దురవార్త వింటే మీ నాన్నగారు ప్రాణమే విడుస్తాడు-"

అమ్మా!- ఆనంద్ నన్ను క్షమిస్తాడనే నమ్మకం నాకుఉంది. అతని క్షమాపణతోగాని నాకు శాంతి ఉండదు. జీవితమంతా ఈ రహస్యాన్ని దాచలేను. అతనికి ద్రోహించేస్తూన్నానేమో అన్న బాధ నన్ను దహిస్తూంటుంది-"

అమ్మాయి!-యిట్టి సంఘటనలు మగవారికి వినిపించి కష్టములు తెచ్చిపెట్టుకొనడం మంచిదికాదు."

అమ్మా!- భర్తకు తెలియకుండ కళంకచింతతో మనసులో కాల్చుకొంటూ జీవించడంలో మాత్రం ఏ సుఖముంటుంది!-

పిచ్చిపిల్లా!- యిది విని అతడు నిరసిస్తే నీస్థితి ఎట్లుమారునో గ్రహించ గలుగుతున్నావా?-నీ స్థితిలోపాటు మనగౌరవంకూడ ఏ రూపం దాలుస్తుందోకూడ యోచిస్తున్నావా?-"

"అమ్మా!- ఆయన నన్ను క్షమిస్తాడు. నాకు జరిగిన అన్యాయం నానేరముగా ఎంచరు. అతని ఓదార్యంతోగాని నాలో శాంతి ఉండదు-"

"చంద్రం- జాగ్రత్త!- వెర్రి ఊహలు పెట్టుకొని మమ్ములను అవమానముల పాలుచేయకు. ఎవరూ ఎరుగని ఈ అన్యాయ కళంకాన్ని అందరకు వినిపించి మమ్ములను అపహాస్యముల పాలుచేయకు. ఈ విషయం వింటే నీ ముసలితండ్రికి ఈనాడే గుండె పగులుతుంది-" అని తల్లి రామమ్మగారు కొంచెం మందలించే గొంతుకతో అర్థించింది-"

"అమ్మా!- జరిగిన పాపంతోపాటు, భర్తకు మోసంచేసే పాపంకూడ నన్ను కట్టుకొనమని నీ ఆదేశమా!-"

"బలవంతంగా విధి ప్రేరణతో నీయిష్టం లేకుండానే జరిగిన ఆ పాపకార్యం అపవిత్రత నీకు చెందదు. ఆ విషయం నీవు పూర్తిగా మరచిపోవాలి-"

'అమ్మా!-'

"చంద్రిం!- యిహ మాట్లాడ నక్కర్లేదు. నేను నీతల్లిని, నా ఆజ్ఞను నీవు పరిపాలించాలి. నీ శ్రేయస్సుకోసం చెప్పే నామాటలను ఆమోదించడం నీ ధర్మం. మరి పది దినములలో నీ వివాహం కానున్నది. తొందరపడి అవివేకంగా అతనికి ఆ సంఘటన వినిపించావంటే నీకే కాదు. ఈ యింటికే మోసం వస్తుంది. మా మర్యాద కాపాడుటకైనా ఈ రహస్యం మరియొకరి చెవిని వేయకూడదు—" అని తల్లి చెపుతూంటే మరి మాట్లాడలేక కంట తడిని తుడుచుకొంటూ చంద్రిం అక్కడ నిలువకుండ లోనికి నడచింది-

నడచిపోయే కుమార్తెవంక రామమ్మ దీక్షగా రోచవగా వోనిమిషం చూచి ఆమె వెనుకనే లోనికి నడచింది.

♦ ♦ ♦ ♦

"చంద్రిం!-"

"——"

క్రొత్తసిగ్గు కలుగుతూందా!

చంద్రిం! అలామాట్లాడకుండ ఊరుకొంటే ఏమనుకోవాలి! అంత ఆనందంగా నారాకకోసం ఎదురుచూచే నీవు నాలుగు దినముల నుంచి నాకు అగుపడకుండానే తప్పించుకొని పోతున్నావ్! ఇది పెండ్లి ముందు పెండ్లికూతురు సిగ్గుకాబోలు! ఈసిగ్గుతో నాకు అగుపడకుండ పోతే నాప్రాణం ఎలాకొట్టుకొంటుందో తెలుసా! నిన్ను అనుదినం కలుసుకొన అలవాటుపడిననాకు—

ఆనంద్! అవును. నీకు నేను అన్యాయమే చేశాను- కాదు— ద్రోహమే చేశాను- నీకు అగుపడలేకపోయాను.

ఏమిటీ! చంద్రిం! నీకండ్లవెంట కన్నీరా?

ఆనంద్ బాబూ! అని, యిహ మాట్లాడలేక కెరటంలావచ్చే ఏడ్పును ఆపుకొనడంలో ఆమె పెదవులు ఒణకుతో లోనికి అణగి పోతూన్నాయి—

చంద్రిం! ఏమిజరిగింది. ఎందుకా ఏడ్పు? వివాహ ఏర్పాట్లు ఏమైనా తారుమారు అయినవా? మరి మూడుదినములేకదా వివాహానికి వ్యవధిఉంది!

యింతలో, అపశకునమా?

కాదు—

వివాహానికి అడ్డుకారణంకాదుగదా?

ఊహూ-

ఎవరికైన జబ్బుచేసినదా?

కాదు ఆనంద్!

చంద్రిం! నాకువినిపించడమా? ఏమిటి?

ఆనంద్, నీవు క్షమిస్తావనే ఆశతోనే యిచ్చటకు వచ్చాను. మనవివాహానికి ముందు ఈరహస్యం ఎరిగించకుండ నిన్ను మోసము చేయలేను. నేను ఎరిగిచేయని అపచారం—

అపచారమా? నీవా? నాపట్ల అపచారం చేయడమా—? నాతపనా?

అవును- నాపట్ల క్రౌర్యం జరిగింది! అదురాగతమునకు నేను ఎరకావలసివచ్చింది.

చంద్రిం! నీమాటలునాకు అర్థంకావడంలేదు-

నన్ను క్షమించగలవా ఆనంద్!

ఎందుకు కాదు? నీవు నాకు ఎదిరించకుండానే ఈ దుఃఖం ఎందుకు? నీవు నాపట్ల అపచారం జరిగించలేవు. నీ అంతరాత్మ నాకు బాగుగా తెలుసుకదా? చెప్పు- నీవిచారం ఉపశమించుటకు నా ప్రాణమునయినా యివ్వగలను.

నాకు తెలుసు- నన్ను క్షమిస్తావని, మనఃపూర్వకముగా నన్ను ఆదరించి అనుగ్రహం చూపడమే నాకు కావలసినది.

చంద్రా! నా వంకకు తిరిగి నీవిచారానికి కారణం వినిపించు— ప్రాణమైన యివ్వ వెనుదీయని నీ ఆనంద్ నీవిచారం ఉపశయింపచేయుటకు క్షమాపణయే యివ్వలేక పోతారనే విచారపడుతున్నావా?

ఆనంద్! ఈ అన్యాయం మనసులో యిముడ్చుకోనలేక ఈనాడు బలవంతంగా హృదయ ప్రేరణతో ఈవలకు వచ్చాను.

చంద్రా! ఈనాడు చాల బేలగా మాటాడుతున్నావు. నీలోని పెంకితనం చలాకీ ఈవిధంగా మార్పుగలిగిన ఆవిచారవిషయం ఏమిటా అని నా మనసుకూడ వేగిరపడుతోంది. వినిపించు చంద్రా! మాట యిస్తున్నాను- భయపడకు. పెంకితనపు మాటలలో చూచే నీ ముహం ఈనాడు ఈవిషాదంలో చూడలేక పోతున్నాను.

ఆనంద్! ఆమాటలు నానోటితో విని పించలేను- ఇదిగో— ఈ కాగితంలో వ్రాసి తెచ్చాను. ఇది అందచేయడానికే నిదగ్గరకు వచ్చాను- అని విచారంతో గొంతుకలోనుంచి ఉబుకుతూన్న దుఃఖాన్ని ఆపుకొంటూ ఆఉత్తరం ఒణకే చేతితో అతనికి అందించి తలను ప్రక్కగా త్రిప్పి, వంచుకొంది...

ఆఉత్తరములోని విషయములు అతని ముహంలో భీకరరూపాన్ని తీసుకొని రాగలిగాయి.

అతనిలో తుఫాను రేగినట్లు సూచనలు ఆ కనుబొమల ముడితోనూ, ఎర్రపడ్డ కండ్లలోనూ, పెదవుల ఒణుకు ఆవేశంలోనూ అగుపిస్తూండడం చంద్ర గ్రహించి దిగులుగా తలవంచుకొంది.

ఉత్తరం చదవడం పూర్తిచేసుకొని, ఆ కాగితం పై రెండుచేతుల తోనూ చింపి నులుమివేస్తూ తలఎత్తి ఆమెవంక చూచాడు.

చంద్రిం! మంచిది! యిప్పుడు నీవు ఏమిచెప్పుకొన వచ్చావు.

నిజం ఎరిగించి క్షమాపణ వేడుకొని, అంగీకరించి అనుగ్రహించమని వేడుకొనవచ్చాను.

చంద్రా! ఆనంద్ పరువు, పౌరుషంలేని చవటవ్యక్తి యని ఊహించి అడుగవచ్చావా? జరిగింది! జరిగినది ఆనంద్ హృదయంమీద సమ్మెట పెట్టు—

ఆనంద్; అనుగ్రహించలేవా?

ఒకడు కక్కిన ఎంగిలికూడుకొరకు ఆశించే నీచజీవిని కాదు నేను. నాకూ పౌరుషముంది. వాడు ధనికుడైనంతమాత్రములో ఎంగిలిచేసి విడచిన వస్తువును ఆదరించవలసిన అవసరం నాకు ఏమిఉంటుంది! అతని అధికారములో లొంగి నృనతపడవలసిన నిమిత్తం నాకులేదు.

ఆనంద్! అతనికార్యదోషం అనుభవించవలసినది నేనా; న్యాయాన్ని గుర్తించలేవా? అంటూ మాటలు ప్రకటింపలేని బాధను ఏడ్పులో అతనిముందు ప్రకటించుకొంది.

చంద్రా! ఇందునీవు ఎరిగిచేసిన దోషంలేదని నేను ఎరుగుదును. నామనస్సుఏలనో నిన్ను అంగీకరించలేకపోతోంది. పొరపాటున విషం కలుపబడిన పదార్థమును మనము తెలిసి భుజించగలమా?

ఆనంద్! యిప్పుడునేను ఏమిచేయ్యాలి! ఎక్కడకుపోవాలి... అంటూ ఆమె విచారంతో గొంతుకలోనుంచి ఉబుకుతూన్న దుఃఖాన్ని అవుకొంటూ మాటాడుతూంటే,

చంద్రా! ఏమిచేయను. నన్ను చిత్రవధచేసినా నాప్రాణి యింతబాధపడేది కాదేమో! నీకు వశమైన నాశక్తులన్నీ ఈనిముషంలో తిరుగుబాటు చేస్తూన్నాయి. ఈవిషాదభయంకర విషయం నా రక్తంను వేడిపర్చి ప్రతీకారంకోసం పరుగులెట్టిస్తూంది. ఒకరిచేత ఎం

గిలిపర్చి విడచిన వస్తువెంత గొప్పదైనా ఆశించి, స్వీకరించడం ఉత్త మవంశీయుల లక్షణంకాదు. చంద్రా! నిన్ను వివాహం చేసుకొన లేనని చెపుతూన్నందుకు క్షమింపవేడుచున్నాను. అని ఆనంద్ ఆమె వంక చూడకుండానే చెప్పుమాటలకు ఆమెకండ్లు క్రోధరూపాన్ని దాల్చినాయి.

స్వార్థపరుడా! అర్థమైంది నీప్రేమ. మాధవ ప్రవర్తులుగలమాష జీవివని తెలుసుకొనలేకపోయాను. విశాలహృదయంగల మానసివనీ దురభిప్రాయపడి నన్ను నేనే మోసం చేసుకొన్నాను: మంచిది,నీఅను గ్రహంగాని, క్షమాభిగాని యిహనాకు అక్కరంనేలేదు- వెడుతూ వున్నాను...

చంద్రా, ఆతనిచే చెరుపబడిన నీవు ఆతనినే వివాహం చేసు కొనడం మంచిదని-

ఆగు! సిసలవాలను అడుగుటకు నేను యిచ్చుటకు వచ్చియుండ లేదు_నాతలిదండ్రుల వంశగౌరవం కాపాడువిషయుప్రశ్న యిప్పుడు నాముందు నిలచిఉంది. దానికొనమో యోచింపవలసిఉంది. అదే యోచిస్తూన్నాను. సరే_ ఆవిషయం నేను చూచుకొంటాను. సెలవు. వెడుతూన్నాను.

అభిమానానికి బదులు అసూయ- అనురాగానికి బదులు ద్వే షం- సహాకారానికి బదులు ప్రతీకారం- పరమార్థానికి బదులు స్వా ర్థము ఆతనిలో విశ్వరూపం దాలుస్తూంటే ఆనంద్ ఆమెను న్యాయ దృష్టితో చూచి అనుగ్రహించలేకపోయాడు.

పురుషుల సహజస్వార్థం ఆతనిని ఆవేశించి ఆమెను తృణీకరింప చేసింది——

ఆమెను తృణీకరించిన ఆతనమనస్సు ఆమె నిష్క్రమణతో వేదించి పీడించినట్టయింది.

చంద్రం తన తిరస్కారముతో ఏమియుపద్రమునకు లోనవు తుందో అనే సింపతీ- ఆతని హృదయంలో ఒకమూలనుంచి తలఎత్తు తూంటే ఆనంద్ అక్కడ నిలువలేక వెనుతిరిగి నడచిపోయాడు.

---

## 6

వీరన్నా! చంద్రం పెండ్లి ఆగిందంట కదూ!

ఆ! ఆఆనంద్‌గాడు పట్నం పారిపోయినాడట. అందుచేత పెండ్లి ఆగిపోయింది.

పోవడాని కారణం?

అదీ తెలియకుండా ఉందండి ప్రభూ!

అదంటే వాడికి అపరిమిత అనురాగంఅటకదూ!

అట్టిపరిస్థితిలో వివాహానికి ముందు అదృష్టాన్ని కాళ్ళ దన్ను కొని అగుపడకుండ పోవడంఏమిటి.

శని ఆవేశించినప్పుడు అదృష్టదేవత పిశాచిలాగే అగుపడ వచ్చును కదా!

ఇది ఏదో విచిత్రంగానే ఉంది.

లేకపోతే_ చంద్రం మీవల్లచెడిన సంగతివాడికి అంది యుండలేదుకదా.

ఛా! ఆపని జరిగియుండదు. దానివివాహానికి అడ్డుపడి జీవితం నాశనం చేయడం మనకు అక్కరమాలిన పని. మనవాంఛ తీర్చుకొని పంపివేయడంవరకే మనపని...

తమరువాడికి తెలియబరిపించారని నాఉద్దేశంకాదండి దొరా!

మరి! ఈరహస్యం మనముగ్గురిలో తప్ప మరిఎవరికి తెలియదు కదా! నీలకంఠంనకు ఈఊరివారు తెలియనే తెలియరుకదా!— నీవుచెప్పవు. నావల్ల తెలువబడలేదు. చంద్రం తానే సిగ్గువిడచి చెప్పుకొనలేదు. మరియొకలా వాడికి తెలియడానికి మార్గం ఎక్కడిది.

కోరి వివాహం చేసుకొనేపిల్ల దొరకినప్పుడు ముహూర్తం ముందు యిల్లువిడచి పోవడం అందరికి ఆశ్చర్యంగనే ఉంది.

"అది మళ్ళీ ఎవరిచేతిలో పడనున్నదో!- దానిని కట్టుకొని అనుభవించేఅదృష్టం ఎవరికి వ్రాసియుంచాడో భగవంతుడు!-'

"చిత్రం. నీలకంఠంగారు బలే తమాషాగా నాటకం ఆడారండి. మీచేతి పిస్తోలుదెబ్బ తిన్నట్టు అంత నేర్పుగా ఆయన నటించకపోతే అది మీ గుట్టం ఎక్కడికాదండి. చాల అగతాయిరకం పెంకిపిల్లండి చంద్రిం. అది మీగుర్రంమీద మీతోవచ్చి వేసిందంటే అసలు నేను నమ్మలేకపోయాను-'

అగతాయిరకం పెంకిపిల్లండి చంద్రిం. అది మీ గుర్రంమీద మీతో వచ్చివేసిందంటే అసలు నేను నమ్మలేకపోయాను-"

"యుక్తితో ఎంత పెంకిదాసినైనా కట్టివేసి అనుభవించగల శక్తి మనలో ఉంది-"

"బంగళాలో అల్లరిచేయకుండా ఊరుకొందాండి!-'

'దాని అల్లరి యిక్కడ ఎవరు వింటారోయ్!- తప్పించుకొన ఎన్నివిధాల ప్రియత్నించాలో ప్రియిత్నించింది. ఎంత బ్రతిమాలినా లొంగకుండ, నేను చూపిన ఆశలను లెక్కచేయకుండ చాలా శ్రమపెట్టింది. చివరకు బలవంతం చేసి సింహములా లంఘించి నా కామం తీర్చుకొన్నాను- ఆసుఖంలో చేయునదిలేక మూర్ఛిల్లినట్లు కండ్లుమూసుకొని కదలకుండ నేలమీద పడిపోయింది. ఆమె మూసిన

పెద్దకండ్ల అందాన్ని చూస్తూ ఆమె సౌందర్యమును తనివితీర అనుభవించాను. తృప్తితీర అఘ్రాణించి వశపరచుకొన్నాను-'

ఆమె పెండ్లి ఆగిపోవడంతో ఆమెతండ్రి రంగాప్రసాద్‌గారు జెంగతో మంచం ఎక్కారు. అతనికి సేవచేయడంలో చంద్రం అసలు ఈవలకు రావడమేలేదు.

జబ్బుచేసిందా!- ఆ ముసలివానికి ఆ స్థితిలో జబ్బా!-

అవును. అందుచేతనే యిహ అతడు బ్రతుకుతాడనే ఆశలేదని చెప్పకొంటూన్నారు మా ఊరివారు.

అరే!_అయితే చంద్రం చాల ఆపదలో చిక్కుఉందన్నమాట

అవును. ఆ మొగదిక్కు ఒక్కడూపోతే వారిగతి ఏమికావాలనే సంతాపం వారిని-

వీరన్నా!- ఈ స్థితిలో ఆ ముసలి రంగారావుకి మనం వైద్యం చేయించి బాగుపరపించ ప్రయత్నం చేశామంటే చంద్రం మనకు సానుభూతిచూపుతూ మచ్చికపడదంటావా!-

వద్దు బాబూ!- నాకు తెలుసు. రంగాగారి భార్య రామమ్మగారుకూడ చాల పట్టుదల అయిన మనిషి. తనకు జరిగిన చెరనుగూర్చి చంద్రం తల్లిదండ్రులకు చెప్పియే యుంటుంది. అది పరాభవంగా ఎంచి మనలను దూషించక విడువరు_

వీరన్నా!- మరి ఉపాయం లేదా!-

ఒకటేమార్గం-

ఏమది?-

నారయ్యశాస్త్రి లేడూ!- అతడే ఆయింటి వైద్యుడు. అతని ద్వారా కొంతపని జరిగించుకొనవచ్చును-

అది ఏలా సాధ్యపడుతుంది!-

శాస్త్రి డబ్బుఅంటే ఆశపడుడుకదా!- అతనికి డబ్బు ఆశచూపితే ఏపనిఅయినా చేస్తాడు.

ఆతనివల్ల మనకు ఏమికాగలదు?

చంద్రిం ఆశ్రేష్ఠియింటికి తండ్రిమందుకొరకు వస్తూంటుంది-"

శ్రేష్ఠి యిల్లు ఊరుచివర కొబ్బరితోటలో కదూ!

అవును.

పూర్వంవలె చీకటివేళలో రాదుకదా!

ఊహూ! బలవంతంచేసి అక్కడనుంచి తీసుకొనిరా ప్రియత్నం చేసిన ఎడల ఊరువాగంతా మీాదపడకమానరు. చాల ఉపద్రవము జరుగుతుంది—

మరినీవు చెప్పే ఉపాయం?

వినండి- శ్రేష్ఠి మీామాటకు అడ్డుచెప్పడుకదా!

డబ్బు ముందుగా పారివేస్తే శ్రేష్ఠి ఎంతటిపనికైనా సిద్ధం. తని సంగతినాకు పూర్తిగా తెలుసు—

రంగాగారి యింటికి శ్రేష్ఠివెళ్ళి జబ్బుమనిషిని పరీక్షించి యింటిదగ్గరమందు యిస్తానని చెప్పి చంద్రింను వెంటపెట్టుకొని తనయింటికి తీసుకొని రావాలి.

ఆతరువాత—

నారింజరసం మర్యాదకోసం యిచ్చినట్లు చంద్రించేత ఆయన త్రాగించాలి.

దానివల్ల ప్రియోజనం?

ఆనారింజరసంలో మీాదగ్గరఉన్నదని నీతోచెప్పిన మత్తుమందు అందులోకలిపింది త్రాగించాలి.

స్పృహతప్పిన తరువాత ఆమెను శ్రేష్ఠి మనకు వప్పగించాలని నీఉహా కదూ!

అవును- అలాగే జరిగించాలి. స్పృహవచ్చిన తరువాత మన

బంగాళాలోనే బంధింపబడుతుంది. ఈమారు దానితో చనువుచేసుకొ
నుటకుకూడ అవకాశం ఏర్పడుతుంది.

ఏదోలా మరియొకమారు చంద్రిం నాకు అందడమే కావాలి-
శేరిష్టిని నామాటగా యిక్కడకు పిలుచుకొనిరా? ఈరకం స్త్రీలను
వశపరచుకొనుటకు భద్రపరచిన మత్తుపదార్థం తంత్రింగా ఆరెంజి
రసంలో కలిపించి ఆమెచేత త్రాగించవలసిన బాధ్యత ఆతనిమీదనే
ఉంచుతాను—

ఆదెబ్బతో చంద్రిం తిరిగిమనకు చిక్కినదన్నమాటేగా—

మంచిఉపాయమే చెప్పావు వీరన్నా! ఇదిగో ఈయిరువదిరూ
పాయలు నీకు అడ్వాన్సు బహుమానం.

— ఎంత తెలివి తక్కువగా ప్రవర్తించి యిక్కడకు వచ్చావురా!

కర్తవ్యతా మూఢున్నాయి. వివేకాశూన్యుండనై యోచనశక్తి
లేక, న్యాయాన్ని చూడలేక అప్పటిఉద్రేకంతో ఆమెను తృణీకరిం
చి త్రోసిబుచ్చాను.

పిచ్చివాడా! ఆమె తనకు జరిగిన అన్యాయంగూర్చి నీముందు
మభ్యపరచలేక, ద్రోహ చింతను భరించలేక వివాహానికి ముందు
విశాలహృదయంతో నీతో చెప్పుకొనవచ్చిన ప్రేమికురాలికి యిదా
నీవుచూపవలసిన సానుభూతి! ఆమె ఎరిగిఉండి చేసిన అన్యాయంగాని
అక్రమంగాని ఏమిఅగుపించిందనితృణీకరించి ఆమెను చిన్నబుచ్చావ్.
ఆనంద్! ఆమెకు అక్రమంచేసి పంపివేయగలిగావ్. పశ్చాత్తాప
బుద్ధితో నీతో—

అచ్యుతం! నాజ్ఞానేంద్రియాన్ని తెరిపించి న్యాయాన్నిచూ
పావు. నిజం! నాచంద్రిం నన్ను మనఃపూర్తిగా ప్రేమించి నాతో
వివాహం కోసమే అనేకసంబంధాలను త్రోసిబుచ్చింది. నేను పట్నం
లోచదువు సంధ్యలులేనివాడినై చెడిపోయానని విన్నప్పుడుకూడ,

నన్ను క్షమించి నాతో వివాహంకోసం తన తల్లిదండ్రులతో వాదించి కోరుకొంది. నా ఆనందంకోసమే నన్ను అనుదినం రహస్యంగా కలుసుకొని లాలించేది. అట్టి నా అదృష్ట దేవతను తూలనాడి త్రోసిబుచ్చాను.

ఆనంద్! ఇప్పటికైన మించిపోయినది ఏముంది! తిరిగి నీగ్రామం యిప్పుడే చేరుకో! ఆమెను కలుసుకొని నీతిరస్కారమునకు క్షమాపణ వేడుకో! ఆమెను వివాహం చేసుకొనుటకే ప్రయత్నించు—

అచ్యుత్! ఏముఖంతో తిరిగి మా గ్రామం చేరుకోగలను నేను! వివాహం ఆపి ఆ కుటుంబమునకు తీరని సంతాపం కలుగచేశాను. నాయందు ప్రేమను చూపి నన్నే వివాహమాడ నెంచిన నా చంద్రికకు అపకారంచేసి మరల ఆమెను ఏలా చూడగలను-

ఫరవాలేదు. ఆనంద్! ధైర్యం వహించు! లే. వెళ్ళు. ధీరబుద్ధితో ఆమెనే వివాహంచేసుకో! ఆ కడుంటే ధనమదాంధతతో చెలరేగే అవినీతి పనులను అణచడానికి ప్రతిజ్ఞ చెయ్యి! ఆ జమీందారు మీదనే ప్రతీకారదీక్షను పూని బుద్ధిచెప్పు! లే! మనస్సు దిట్ట పరచుకో! చంద్రిక నిన్ను క్షమిస్తుంది. నిన్ను తిరిగి వివాహమాడుటకు సంతసపడుతుంది.

నిజమేనా? ఆత్మగౌరవం ఎరిగిన చంద్రిక నా తిరస్కారణకు కోపించకుండ క్షమించగలదా? ఆనంద్‌ను పూర్వంవలె ప్రేమిస్తుందా!

“స్త్రీ ప్రేమను నీవు ఎరుగవు. ఆమె నిన్ను క్షమించి స్వీకరిస్తుంది. మగవారి స్వార్థం స్త్రీప్రేమకు సంకట కలిగించుకొని మనస్సును నీచపరచుకొనదు. అట్టి ప్రేమికునికి ప్రాణమయిన యిస్తుంది. త్వరపడు- వెళ్ళు”

“అచ్యుత్! నా కండ్లు తెరిపించి నా అజ్ఞానమును పారదోలిన నీకు నమస్కృతులు. ఇప్పుడే వస్తాను. ఆమె కాళ్ళమీద పడి క్షమా

వణకోరుకొని వివాహమాడతాను. అని ఆనంద్ అంటూంటే ఆతని మిత్రుడు ఆతనికి కోటును తొడగి తొందరగా ఆపల్లిగ్రామం పంపి వేశాడు.

---

## 7

'ఓ! ఆనందా!...ఎప్పుడు తిరిగినీరాక!—'

"ఈదినం సాయంకాలమే-"

"యింటివద్ద అగుపడ్డావా!"

"ఆ! రంగాగారినిచూచి పోవడానికి వారియింటికి కూడా వెళ్లాను."

"రంగాగారి యింటికా!...అవును. పాపం ఆయనకు యిప్పుడు ఏలాఉంది!—"

"జబ్బుస్థితిలో కదలలేకుండానే ఉన్నారు. చూడు వీరన్నా!— సాయంత్రం నాలుగుగంటలకు మునుకువెళ్లిన చంద్ర యింకవరకు యింటికి రాలేదని ఆమెతల్లి రామమ్మగారు కంగారుపడుతున్నారు."

"ఐతే శాస్త్రిగారి యింటికేమీపోక!-'

"అవును. ఆమెను కలుసుగొని తీసుకొనిరావడానికే"

"వెర్రిమారాజులు!— అందుచేతనే అది మిమ్ములను అలా ఆడించే పేరుకోసం మిమ్ములను భర్తగాపొంద ప్రయత్నిస్తూంది"

"వీరన్నా !—ఏమిటి నీమాటలు!-"

అబద్ధంచెప్పడానికి నాకేం కావాలిబాబూ!- మొదటినుంచి సాతకాతాయేగా!"

"వీరన్నా!—నాకు ఏవో మోసపు మాటలను వినిపిస్తున్నావు"

"లేదండి—ఇప్పుడు వెళ్ళి జమీందారుగారి పడకగదిలోకి రహస్యంగా అద్దాలతలుపులలోనుంచి పొంచిచూడబట్టి అక్కడ అచంద్రిం ఆయనతో మధురమయ దేవత్వసుఖాన్ని అనుభవిస్తుంటుంది అప్పుడే మీకు అర్థమౌతుంది."

"పద- నాకండ్లతో స్వయంగా చూచువఱకు విశ్వసించ లేను.' అని ఆనంద్ అంటూంటే వీరన్న విషపునవ్వుతో ఆతనిని వెంటనిడుకొని జమీందారుగారు బంగాళావంకకు బయలు దేరాడు.

వీరన్న ఆనందకు దారిచూపుతూ ఆవంకకు తీసుకొని పోయాడు.

వీరన్న ఆగది అద్దములకిటికి ప్రక్కకు చేరి ఆగాడు.

ఆనంద్ ఆతినిని అనుసరించాడు.

చంద్రిం మొహామల్ పరుపుమీద పడుకొనిఉంది—

జమీందారు ఆమెప్రక్కనే కూర్చుని ఆ మెముహంమీద మూగుతూన్న ముంగురులను సరిచేస్తూ ఆమెశరీరాన్ని స్పృశిస్తున్నాడు.

"ఆనంద్ బాబూ!— చూడండి! చంద్రిం ఆతనిగదిలో ఎంత స్వేచ్ఛగా నిద్రిస్తుందో!- ఆమెను తనదానిగా చేసుకున్న జమీందారు ఆమెప్రక్కనే శరీరాన్ని తాకుతూ—" అని వీరన్న చెవుతూండగనే ఆనంద కండ్లు లోపలదృశ్యాన్ని చూచాయి-

ఇహ ఆగలేక పరుగున వెళ్ళి బంధింపబడిని అద్దముల పెద్దతలుపును 'పెడి'లున తన్నేడు

అద్దములు పగిలి పెద్దచప్పుడుతో తలుపువిడిపోయింది.

వీరన్న ఒక్కపరుగుతో అక్కడనుంచి మాయమయ్యాడు-

"రాక్షసీ!— లే!- నన్ను మాయచేయతలపడిన వ్యభిచారిణివని యిప్పుడు స్వయంగా తెలుసుకొన్నాను.' అని ఆనంద్ ఆకలిగొన్న

సింహములా అరవడంతోనే పక్కమీదపరున్న చంద్రిం కండ్లు తెరిచి-

"ఎవరూ?- నాఆనందా?— నేనుఎక్కడఉన్నాను? ఆనంద్!- ఆనంద్—' — అని చంద్రిం ఆశతో నిద్రనుంచి మేల్కాంచినట్లు లేచి నిలువబడింది.

"ఎవడవు నీవు, నాబంగాళాలో కాలుపెట్టి ఏధైర్యంతో వచ్చావ్—"

"మోసబుద్ధి,— మీయొక్కపురిపాగాలు తీయడానికై కాలు డనై నీగదికివచ్చాను-'

"మంచిది జాగ్రత్త— అడుగుకదలితివా. నాపిస్టలుకు ఎరకా గలవు." అంటూ పరుపుక్రిందిపిస్టలును తీసి ఆనందువంకకు గురిపెట్టా డు జమీందారు-

పిస్టలు ఆతనిచేతినుంచి జారి చంద్రిం కాలుముందుపడింది-

ఆనందును విసరువచ్చి జమీందారు ఆపిస్టలు అందుకొనడానికి పరుగెత్తుకొనిరా చూడగా చంద్రిం ఆపిస్టలును తొందరగా అందు కొని ఆనందుదగ్గరకు విసరింది. ఆనంద్ ఆపిస్టలును అందుకొని జమీం దారుకి గురిపెట్టి ఢాం మనిపించాడు.

తోడనే జమీందారు విశ్వాసరావు హాహాకారాలతో విలవిల తన్నుకొంటూ నేలగూలాడు.

---

## 8

జమీందారుని తానే స్వయంగాచంపినట్లు అంగీకరించి వాం గ్మూలం ఇవ్వడంచేత హత్యానేరం చంద్రింమీద పడింది.

ఆనంద్! ఈమన వీడ్కోలులో ఈవిధంగా ఏడ్చి నన్ను ఆవేద పడచకు. నాకు ఏచింతా లేదు. నన్ను మరచిపో—!

జమీందారుబంధువులు, లేనిసాక్ష్యములనుకూడ దీసి కేసు బలపరచడంచేత మానసంరక్షణకొరకు చంపాననీ చంద్రిం వాదించిన వాదనలకు సాక్ష్యంలేక కోర్టువారు ఆమోదించలేదు.

నేరం చంద్రింమీద బలపడింది.

న్యాయస్థానం ఖూనీనేరమునకు ఆమెకు ఆదినమే ఉరిశిక్షను విధించినట్లు తీర్పుయిచ్చారు.

మరి నాలుగుదినములలో చంద్రిం ఉరితీయబడుతుంది.

జయిలర్ పర్మిషన్‌తో ఆనంద్ ఆమెను కలుసుకొని చెరశాల యినుపకటకటాల దగ్గరకు నెమ్మదిగావచ్చి గద్గదకంఠంతో నోటమాట రాక ఆగాడు—

వార్డన్ చంద్రింను. ఆతడు నిలచిన స్థలమునకు సమీపంలోనికి తీసుకొని వచ్చాడు—

ఎవరూ! ఆనంద్‌గారా!

అవును. ఆపాపినే నేను! నేనుచేసిన నేరం నీనెత్తిని త్రోసి శాంతిగా భూమిమీద నిలువచూచే కర్కసహృదయుడను నేనే—

ఆనంద్! విచారించకు. నాప్రాణములుకూడ నాప్రేమికుని రక్షణకొరకు బలిగా యివ్వగలిగిన అదృష్టానికి నేను సంతోషపడుతూన్నాను. ఈచావువల్ల నాకుపరముంది. ఆనంద్! విచారించకు. నన్ను శాంతివచనములతో యిప్పట్లో పంపాలి. నాఆత్మను ఎవరు చంపగలరు. అది నీప్రేమపరిచయంకోసం, నీసేవకోసం నీఛాయలలోనే తిరుగుతూంటుంది. విచారించకు.

నిజం! యిప్పుడు గ్రహించాను. ఇదంతా వీరన్న శ్రేష్టులు చేసిన మోసము.

చంద్రా!—

ఆనంద్! ఒక్క మాట. ఇప్పుడే నాముసలి తల్లిదండ్రులు నన్ను చూచి పట్టలేని దుఃఖంతో యింటికి వెళ్ళారు. వారిని ఓదార్చి ధైర్యంచెప్పి వారిని ఓకంట చూడవలసినదిగా నాప్రార్థన—

చంద్రా! నాజీవితమంతా వారికి సేవచేస్తాను—

'నాఅపచారములు మన్నించు ఆనంద్!- నిర్దోషిని, అనికంఠ తడితో దుఃఖాన్ని ఆపుకొనలేక దగ్గుత్తికంతో చంద్రం అంటూండ గనే ఆనందుమాట ఆమెకు అందకుండానే అప్పటికే చాలు టయిము అయిందని యమకింకరునిలా ఆజయిలువార్డను ఆమెనులోనికి తీసుకొని పోయాడు—

ఆనందు పగిలిన హృదయంతో అక్కడనే కూలబడి పోయాడు-

స ం పూ ర్ణ ం

---

# సూచన

మాయచేయబడి బలవంతంగా చెరుపబడిన స్త్రీ కళంకిత అగునా?

మలినపడని హృదయంగలస్త్రీ నిష్కళంకిత కాదా?

పశుకామబుద్ధితో ఘోరగాని చెరపబడినస్త్రీ ఎరిగిచేయని నేరానికి సంఘం సానుభూతిచూపి ఆదరిస్తుందా?— అనేప్రశ్నలజవాబే ఈ కథయొక్క సారాంశం-

ఇట్లు

మీ మానాపురం